# శబ్దాది విషయాలలో సుఖమున్నదా?

శ్రీమద్భగవద్గీతకు వ్యాఖ్యానం చేస్తూ శ్రీశంకరానంద స్వాములవారు 18-37 లో ఈ క్రింది విధముగా సెలవి చ్చి యున్నారు.

కదాచిత్, ఎవరైనా, "బ్రహ్మసుఖము అతిక్లేశసాధ్యము, విషయసుఖమే అత్యంత సులభసాధ్యము. కావున, విషయసుఖమే సుఖార్థిచే భోక్తవ్యము" అని ఆగ్రహము చేసినచో, వానినిట్లడుగవలయును. ఏమిటి--వైషయిక సుఖము 1. విషయముల ధర్మమమందువా? లేక, ౨. కరణముల ధర్మమందువా? 3. అథవా, కర్మయొక్క ధర్మమా? 4. లేక, భోక్తయొక్క ధర్మమా? 5. లేక, దేశము యొక్క ధర్మమా? 6. అథవా, కాలధర్మమందువా? ౭. లేక, అజ్ఞాన ధర్మమా? 8. లేక, జ్ఞాన ధర్మమా? ౯. అథవా, స్వయంగా కరణవ్యాపార అభావస్వరూపమా? 10. లేక, దుఃఖాభావస్వరూపమా? 11. లేక, ఆత్మధర్మమందువా?

1. విషయాల ధర్మమన్నచో, ఏ విషయముచే ఒకనికి సుఖము కల్గుచున్నదో, ఆ విషయముచే సర్వులకు సుఖము కలుగవలెను. సాన్నిధ్యంలో విషయమున్నపుడు, అది అన్ని కాలాల్లో నిరంతరము సుఖమునివ్వవలెను. కాని, అట్లు ఇచ్చుట లేదు. అన్యపదార్థముయొక్క ఇచ్ఛ కలుగుటతోడనే ఆ సుఖము అదృష్యమైపోవుచున్నది.

౨. కరణధర్మమన్నచో, విషయవ్యవధానకాలంలోగూడ సుఖము కలుగవలెను.కాని, అట్లు కలుగుటలేదు.

3. సుఖము పుణ్యకర్మయొక్క కార్యమున్నందున దాని ధర్మమనుట అనుపపన్నమగును. కర్మధర్మమ న్నచో, కర్మరూప ధర్మోత్పత్త్యుత్తరక్షణములోనే సుఖము ఉదయించవలెను. అనగా, కర్మానుష్ఠాన కాలంలోనే సుఖ ము కలుగవలెను.

4. సుఖము భోక్తయొక్క స్వరూపమేయన్నచో, అతడు ఎప్పుడు గూడ విక్షేపమునొందగూడదు. అట్లగుప డుటలేద గదా!

5. దేశధర్మమన్ననో, అన్ని దేశములలో సుఖముండును గాన స్వర్గగమనేచ్ఛ ఉండగూడదు. స్వర్గాదుల్లో విశేష సుఖమున్నదనినచో "**ఇంద్రలోకే మహద్దుఃఖం ప్రాజాపత్యే మహత్తరమ్**" "**ఆబ్రహ్మభువనాల్లోకా పునరావర్తినోఽర్జున**" (గీత. 8-16)అనంటూ ఇంద్రలోకాదుల సుఖమును శాస్త్రము నిందించగూడదు.

6. సుఖము కాలధర్మమగుచో, ఎట్లు శీతాకాలముగాని, వేసవికాలముగాని సర్వులకు ఒకేసారి ఒకేతీరుగా చలిని, ఉష్ణతను ఇచ్చునో, అట్లే, అందరికీ ఒకేసారి ఒకేతీరుగా సుఖము కలుగవలెను. కలుగుటలేదు.

7. సుఖము అజ్ఞానధర్మము గూడ కాదు. ఎందుకంటే, వస్తువుయొక్క భోగ్యత్వ, అనుకూలత్వ పరిజ్ఞానము లేనిచో సుఖప్రతీతి కలుగుటలేదు.

8. జ్ఞానధర్మము గూడ కాదు. ఏలయనగా, జ్ఞానమున్నప్పటికినీ విరక్తునికి సుఖము కలుగుటలేదు.

9. సుఖము కరణవ్యాపార అభావస్వరూపము కాదు. ఎందుకంటే, స్వప్నములో సుఖదర్శనాభావమువలన, మరియు కరణవ్యాపారముగల భోజనాదులందు సుఖదర్శనమువలన గూడ.

10. దుఃఖాభావస్వరూపము సుఖము అనిగూడ చెప్పుటకు వీలులేదు. ఎందుకనగా, దుఃఖాభావముగల మృ త్పిండాదులలో సుఖప్రతీతి అగుటలేదు. అచేతనమున్నందున సుఖము అభివ్యక్తమగుటలేదనినచో--అది యుక్త ముగాదు. ఎందుకు? దుఃఖాభావముగల బుద్ధిస్ఫూర్తిలో(ఉదాసీనాద్యవస్థలలో) సుఖము ప్రతీతి అగుటలేదు. దుఃఖా భావమే సుఖము--అను యే అతిమూఢ వచనమున్నదో, అదిగూడ అయుక్తమే. ఏలననగా, సుఖము భావరూపము న్నది, అభావరూపము కాదు. పశుతుల్యమగు పురుషులు సుషుప్తియందుగల నిర్విషయక ఆనందానుభూతినొందలే దని విదితమగుచున్నది. అందుకే దుఃఖాభావమే సుఖమంటున్నారు. అట్లయినచో,

11. సుఖము ఆత్మధర్మముగా స్వీకరించవలసివచ్చును? అంటే, అది సరిగాదు. సుఖము ఆత్మస్వరూపము. ఆత్మ ధర్మ ము కాదు.

**శ్లో।। నిర్వాణమయ ఏవాయమాత్మా జ్ఞానమయోఽమలః।**

**దుఃఖాజ్ఞానమలా(మయా)ధర్మాః ప్రకృతేస్తే తు నాత్మనః।।**(వి.పు.6-7-22)

**శ్లో।। న సాక్షిణం సాక్ష్యధర్మాః సంస్పృశన్తి విలక్షణమ్।**

**అవికారముదాసీనం, గృహధర్మాః ప్రదీపవత్।।**(కుం.ఉప.23)

దుఃఖము, అజ్ఞానము మున్నగు ధర్మములన్నియు ప్రకృతి (బుద్ధి)ధర్మములు. సుఖరూపము, జ్ఞానస్వరూప ము మరియు నిర్మలమును అగు ఆత్మధర్మములు కావు. గృహధర్మములెట్లు దీపమును స్పృశింపజాలవో, అట్లే దేహా ది సంఘాతరూప సాక్ష్యధర్మములు- జడమైన సంఘాతముకంటె విలక్షణము, అవికారి మరియు ఉదాసీనమగు ఆత్మను స్పృశింపజాలవు.

ఒకవేళ సుఖము ఆత్మధర్మమే అయినచో, ధర్మము నాశనమైతే ధర్మియగు ఆత్మనాశ ప్రసక్తి కలుగును.

నను (శంక):--- సుఖము ఆత్మస్వరూపమే అయినప్పటికీ, అది క్షణికమున్నందున స్వరూపభూతసుఖనాశ ముచే ఆత్మనాశము తప్పక కలుగును.

సమా:---"**నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మమ్**" (ముం.1-1-6), "**ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః**" ఇత్యాది శ్రు తులచే ఆత్మనిత్యత్వము వినబడుచున్నందున స్వరూపభూతసుఖమునకుగూడ నిత్యత్వము సిద్ధించుచున్నది.

నను:----ఎట్లు సుఖము ఆత్మయొక్క స్వరూపమో, అట్లే దుఃఖముగూడ ఆత్మయొక్క స్వరూపమే కావలె ను? "అహం సుఖీ" "అహం దుఃఖీ" అని యిట్లు సుఖదుఃఖప్రత్యయము(జ్ఞానము)లు ఆత్మకు సంబంధించినవిగా తెలి యబడుచున్నవి.

సమా:---అది యుక్తముగాదు. పుత్రుడు మరణిస్తే "**మృతోఽస్మి**" (నేను చచ్చితిని) అను ప్రత్యయమువలె "అహం దుఃఖీ" అను ప్రత్యయముగూడ మోహముచే ఆరోపింపబడినందవలన మిథ్యయేయగను. పుత్రుడు చనిపోయినచో "**మృతోఽహమస్మి**" అని చెప్పు పురుషుడు మోహముచే తనయందారోపించుకున్నదే తప్ప, నిజముగా తాను మరణిం చడుగదా. అట్లే, "**అహం దుఃఖీ**" అను ప్రత్యయముగూడ మోహముచే ఆరోపించుకున్నదే, కావున మిథ్యయేయగును. దుఃఖము ఆత్మయొక్క స్వరూపమే యగుచో, ఎట్లు సుషుప్తినుండి మేల్కాంచిన పురుషుడు "**సుఖమహమస్వాప్సమ్**" (నేను సుషుప్తిలో హాయిగా నిద్రించితిని) అని సుషుప్తిసుఖమును పరామర్శించి(స్మరించి) చెప్పునో, అట్లే "**దుఃఖమహ మస్వాప్సమ్**" అని సౌషుప్తదుఃఖమునుగూడ చెప్పవలయును. దుఃఖము ఆత్మస్వరూపముకాదు.కావున, సుషుప్తిలో దుఃఖానుభూతి లేదు. అందుకే, సుప్తోత్థిత పురుషుడు "**దుఃఖమహమస్వాప్సమ్**" అని స్మరించి చెప్పుటలేదు. కావున, దుఃఖము ఆత్మయొక్క స్వరూపము కాదు. మఱేమనగా, సఖమే ఆత్మయొక్క స్వరూపము. ఈ విషయంలో,

i) "**సుఖమహమస్వాప్సమ్**" అనునది ప్రత్యక్ష ప్రమాణము.

ii) ఆత్మా సుఖస్వరూపః, సుషుప్తౌ సుఖమాత్రోపలంభాత్, సమాధివత్। ఇత్యనుమానం చ।

iii) "**సచ్చిదానందమాత్రమేకరసమ్**" (నృసింహో.5-7), "**సద్ఘనం చిద్ఘనం నిత్యం ఆనందఘనమవ్యయమ్**"(అ ధ్యాత్మో. 61),"**నిత్యశుద్ధవిముక్తైకమఖండానందమద్వయమ్।సత్యంజ్ఞానమనంతం యత్పరంబ్రహ్మాహమద్వయమ్।।**" (వరాహో. 3-2) ఇత్యాది శ్రుతిప్రమాణములు.

iv) ముముక్షు ప్రవృత్త్యన్యథానుపపత్తిచే కలిగిన అర్థాపత్తి గూడ ఉక్తార్థమునందు ప్రమాణము గలదు.

శంక:---అట్లయినచో, దుఃఖమెవరి స్వరూపము?

సమా:---అనాత్మయొక్క స్వరూపము. ఏలయనగా, అనాత్మ అనృతము(మిథ్య), జడము(స్వపరజ్ఞప్తిశూన్యః) మరియు దుఃఖరూపము అని సుప్రసిద్ధము. "**అతోఽన్యదార్తమ్**"(బృ.3-4-2), "**నాఽల్పే సుఖమస్తి**"(ఛాం.7-23-1), "**తదేతజ్జడం మోహాత్మకమ్**" (నృసింహో ౯-౨) ఇత్యాది శ్రుతిప్రసిద్ధము.

శంక:---'సుఖము ఆత్మస్వరూపము' అని సిద్ధించన మీదట 'విషయసుఖమ'ను వ్యవహారమెట్లు జరుగుతుంది?

సమా:---పుణ్యకర్మ ఫలోన్ముఖమైనపుడు ఇష్టపదార్థముయొక్క సన్నిధానమగును. అపుడు పురుషునియొ క్క అంతఃకరణమందు సత్త్వమావిర్భవించును. దానియందు ఆనందరూప ఆత్మ ప్రతిబింబించును. ప్రతిబింబాత్మానం దముయొక్క స్ఫూర్తియే విషయసాన్నిధ్యమువలన "విషయసుఖము" అని వ్యవహరింపబడుచున్నది. పుణ్యతారత మ్యమువలన సత్త్వతారతమ్యము, సత్త్వతారతమ్యమువలన ప్రతిబింబస్ఫూర్తితారతమ్యము, దానిచే సుఖతారత మ్యమగును. అందుకే, శ్రుతిమాత ఇట్లు చెప్పుచున్నది---"**ఏతస్యైవానందస్యాఽన్యాని భూతాని మాత్రాముపజీవన్తి**" (బృ.4-3-32) ఈ బ్రహ్మానందముయొక్క లేశమాత్రము చేతనే సకల ప్రాణులు జీవించుచున్నవి.

శంక:---బ్రహ్మానందము పరిపూర్ణము గదా! అలాంటప్పుడు 'లేశమాత్రానందమును తీసికొని' అని ఎట్లు చెప్పబ డింది?

సమా:---**శ్లో।।కృత్స్నోఽపి చైష ఆనందస్తదవిద్యైక హేతుజః।**

**బుద్ధ్యాద్యుపాధ్యవచ్ఛేదాన్మాత్రేతి వ్యపదిశ్యతే।।**(బృ భాష్యవార్తికము 1842)

బ్రహ్మానందము పరిపూర్ణమే. అయినను, బుద్ధ్యాది ఉపాధులవలన అవిద్యచే ప్రత్యుపస్థాపిత (ప్రస్తుతింపబ డిన) విషయేంద్రియసంయోగ కాలంలో కలిగే లేశమాత్రానందమును పొంది ప్రాణులు జీవనమును ధరించుచున్నవి.

**శ్లో।। యేహి సంస్పర్శజా భోగాః దుఃఖయోనయ ఏవతే।**

**ఆద్యన్తవన్త కౌన్తేయ న తేషు రమతే బుధః।।**(గీత 5-22)

విషయేంద్రియసంయోగమువలన ఉత్పన్నములగు భోగములన్నియు విషయలంపటులకు సుఖములుగా భాసించినను అవి నిస్సందేహముగా దుఃఖహేతువులే. ఆద్యంతములుగలవి. అనగా, అనిత్యములు. కావున, ఓ అర్జు నా! అధిష్ఠానసాక్షాత్కారముచే భ్రమనివర్తింపబడిన బుధః=పరిపూర్ణమైన బ్రహ్మానందామృతరసపానోన్మత్తుడగు బ్రహ్మ విదుడు, ఆభాసరూప క్షుద్రమైన వైషయికసుఖమును అపేక్షించడు.

శంక:---ఆత్మ పరిపూర్ణము మరియు ఆనందస్వరూపమున్నందున ఎల్లప్పుడు అంతట అందరికీ అప్రయత్న ముగా స్వయముగానే సుఖానుభూతి కలుగవలయును గదా?

సమా:---అట్లు చెప్పుట యుక్తముగాదు. ఎందుకనగా, ఆత్మస్వరూప ఉపలబ్ధికి(సాక్షాత్కారమునకు) వృత్తి శుద్ధము (అంతఃకరణ శుద్ధి) అపేక్షితమున్నది. ఉదా:---పున్నమి వెన్నెల కాంతి పరిపూర్ణముగా ఉండిననూ, దాని దర్శ నానందమునకు చక్షువుయొక్క సౌష్టవము అపేక్షితమైయున్నది. అట్లే ఆత్మానందానుభవమునకు గూడ "**ఆత్మబుద్ధిప్ర సాదజమ్**"(గీత 18-37) పరమాత్మవిషయక బుద్ధిప్రసాదము (బుద్ధిశుద్ధి) అపేక్షితమున్నది. కావున, స్వరూపభూత బ్ర హ్మానందము నిత్యము, నిరంతరము, నిరపేక్షికము, నిరతిశయము, నిరవధికము, నిరావృతము, నిర్విషయకము మరి యు పరిపూర్ణము.అందువలన, శబ్దాది విషయాలద్వారా పొందబడు సుఖము, సుఖముకాదు. మఱేమనగా, దుఃఖమే.

**శ్లో।। యత్సుఖం సాధనాధీనం దుఃఖమేవ తదుచ్యతే।**

**అనన్యసాధనం తస్మాత్ స్వాత్మస్థం పరమం సుఖమ్।।**(బృ.భాష్యవార్తికము 1851)

విషయేంద్రియాది సాధనాధీన సుఖము, దుఃఖమే యనబడును. అన్యసాధన అనపేక్షిత స్వాత్మసుఖమే పర మసుఖము. ప్రత్యగభిన్న బ్రహ్మమే సుఖరూపము. కావున, ముముక్షువు ప్రయత్నపూర్వకముగా దానినే పొందవలసి యున్నది. "**ఆత్మా వాఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః**"(బృ. 2-4-5 + 4-5-6). విచారించినచో విషయా లలో సుఖము లేదు. విషయాలలో సుఖమున్నదను భ్రాన్తి కలుగుచున్నది.

**శ్లో॥అసారే ఖలు సంసారే సుఖభ్రాన్తి మనీషిణామ్।**

**లాలాపానమివాంగుష్ఠే బాలానాం క్షీరవిభ్రమః॥**(సుభాషితము)

బొటనవ్రేలునుండి పాలు స్రవిస్తున్నవను భ్రమచే పసిపిల్లలు తమబొటనవ్రేలును నోట్లోపెట్టుకొని చీకునట్లు, ఈ మనుష్యులు అసారమగు సంసారమున సుఖమున్నదని భ్రమజెందుచున్నారుగదా! పిల్లవానినోటినుండి లాలాజ లము వస్తుంటే, అంగుష్ఠమునుండి వస్తుంది-అని భ్రమజెందినట్లు జీవులు విషయేంద్రియసంబంధమువలన గల్గిన ప్రి య,మోద, ప్రమోద వృత్తులయందు ఆత్మసుఖముయొక్క ప్రతిబింబసుఖముననభవిస్తూ విషయములనుండియే మా కు సుఖము లభిస్తున్నదని భ్రాన్తిజెందుచున్నారు.